

# కవి కషాయం

సభ్యలోకం యెదుట తుషారావనిక

ఇవతల

కవి : బొగైన్ విలా ఛాయల్లో దక్షిణ వాతాయనం యొరగి యుంటుంది; ఋషిమహల్ సాంధ్యరాగంలో...
ఆసీనుడు.

కడుపులో మాట చెప్పుకో గాంధి లేదు—
[హిందోళం

అవతల

వెలపలనుంచి నావలకు పోతూ ధ్వని

కవీ!

కవి : గానమోహిలేడు కావ్యారి నరసింహ
మూర్తి; సుకములందు మోజులేదు
కళల రూపి శిల్పకవి బాపిరాజేడి?
హితులరాక గోష్ఠి బ్రతుకుచుంటి.

అవతలి నుంచే

కవీ! విషాద గీతికాలాపనా?

ఇవతల

కవి : అఁ రాయుడూ!

అవతల.

రాయుడు : నేనే ... ఏమిటా వ్రాత

ఇవతల

కవి : సీతాయణం...

— అవతలవారటే యివతలవారిటేగా —

రాయుడు : అంకితానికి అవతారికా ?

కవి : మా పూర్వులకు యే కలలోనో కన్పించి విన్పించచ
మనో తమ కీర్తి శోభింపచేట్టు చేయమనో మొదలనిచ్చే
దేముళ్లుండేవారట ! నేనో అపూర్వుణ్ణాయిరి...

రాయుడు : ఐతే ఆ చారికలేమిటి చెక్కిళ్ల పైనుంచి ?

కవి : ఒత్తుకుంటూ :
"హాటక గర్భరాణి" నేంకానులే శృంగారించ
టానికి ... ఐనా.
దేవికెవరంకితంబిచ్చితిరో వచింపు ?

రాయుడు : ఇంతకీ నీ రచనకి మూలం ?

కవి : చదివేందుకుగాక ప్రశ్నించే తీరుబడి హెచ్చు...
కళ్లుమూసుకుని ధ్యానుడవయ్యే నీకు యేం
పట్టుతుంది చెప్పినా—

రాయుడు : వింటున్నా కానియ్యి

కవి : తన పూర్వాశ్రమగతి దెలి
సిన ఋషి వాల్మీకికి తెచ్చిన సుఖపడు వా
రిని రావణు బాంధవ్యాల
యనుభవనీయులుగ జేయుటరుదే కైతన్

రాయుడు : ఏమిటీ ?! కనుక !?

కవి : పారంతోషికాలంకార ప్రాభవముకు
ప్రాకులాడు కవీంద్ర సంబంధమెడపి
నర్మసఖుడనై రామునన్నాను; జాన
కీ మనోహరు చిఱునవ్వే కిలకమ్ము.

రాయుడు : ఇంతగా కలసి మెలసి యుంటూన్నాం; వేదాంత విహారులం; ఏమిటా పసందు ?

కవి : దైవ పౌరుషరీతులు సావదాన
ముగ శ్రీరామచంద్రుడే మున్నుదెల్పె
ఎవ్వరనుకొని యడవులకేగు కార
ణమ్ము రావణుజంపె సీతమ్మగాథ.

రాయుడు : సూత్రధారుడైందన్నమాట ఏంకొత్త నీ రచన?

కవి : నటుడవైన, నీరసనపై నటించిందిగా పల్కరింపు!
నాదొక విశిష్ట మార్గాన నడచు రచన
నీతికాకువు సరసధ్వని సునిశిత
సరళ హాస్యప్రసంగ రసాభిరామ
సూర్యస్మృతియగు; నిదియ మా యార్యఫణితి!

శ్రీరాముని ఛాయగా, పుల్కరింపచేస్తానతణ్ణి అన తగినవి అంటూ ... అంతే ...

రాయుడు : కవిగానా ఋషివలెనా నీ యీ రచన ?
సీతకా, రామునికా, నీ ప్రాధాన్యత ? నాందిగా ప్రస్తావిస్తున్నావే ... ఇంతకీ యిది కావ్యమా, నాటకమా, ప్రబంధమా, లేక ...

కవి : ఇదిగో రాయుడూ ! నీ చికిలింపులో కన్ను మూతల్లో శక్తుల్ని సూచించాలని కాబోలు... సూటిగా చెప్పినా తెలియనివాళ్లను, వ్యాఖ్యాతలుగాని విమర్శకుల్ని అడుగమంటే సరి.

రాయుడు : ఓ ఋషి కావ్యమైతే ఋషికాందే పల్కావను కుంటూనా ?

కవి : అవినాభావకులకు అంతరాయాలూ అంత
స్తులూ లేవు రాయుడు!

అథాతో స్వయంవరః

— అవ్రతలా యువ్రతలా మమేకం —

కవిరాయుల్లముఁను గరుడ పచ్చలకాంతి
కమ్మేస్తుంది.

తెలుగులో

కవి ఋణము దీర్చుకొను, సహకారులార
మోదమందెడి రచనా విభూతి పంచి

ఓం తత్సత్

వాయులీనంపై కళ్యాణి సర్వం -

కమ్మని కృతి—

"అన్నవస్త్రములకేది తోవయని
ఎన్నడైన నిన్నడిగినానా ........రామా!

తన యాదర్శను కథ యా
తనికే విన్పింపజేయదలచి యాతడు చూ
డని వివరాలను కావ్య
మ్మున యాదికవి రసవంతముగా వెలార్చెన్

చేయి సాచలేదు

చెప్పి తప్పాలేదు

వంచకులకు శిరము

వంచలేదు

రామ ధ్యాన పరత

రంజిల్లు నేను

సంసార గొడవ

నెట్టి పారవైతు.

రాం రాం

రామా!

దేవ గురుడు నీ నాల్కపై
తిష్ఠ వైచె
భావయని పిల్చి లోగాని
నావు.... మాచు పెళ్లిలో
నాటినుండి యీ వేళవరకు
నిన్ను నా కళ్ల వెల్గులో
నిల్పుకొంటి ....
నారాయణా !

చిత్రి చిత్రాలుగా కథా
చిత్రణమును జేసి
పాడాను ఆడాను వ్రాసి వ్రాసి
అంకితములయ్యె యవి
మిత్రులందరికిని....
........
రాముని కథ విను . . నా మాడ్కి
వ్రాయగలరొ ? ! !

ఇంత యున్న నాకు
యింటిదాతా వచ్చి
చెప్పి పోవు వాడు
శ్రీలలితుడు
'పె ద్ద బా వ ' లేడు
ఎద్ది తలంచినా
ధర్మగామి యంత
తప్పె నాకు ....

స మ ర్ప ణ —

నేను నీవుగా యన్నిట నేను నీవు
గా చరించితిమెన్నాళ్లో గడచిపోయె
బావ ! నారాయణా యను పదము నాకు
దూరముగ చేయలేరు బంధుత్వ సరళి....

---

- పెద్దబావ: వైకుంఠవాసి శ్రీ తటవర్తి వెంకట రత్నం.
- నారాయణ: యశశ్రీ దోర్బిణంరాజు బుచ్చినారాయణమూర్తి.

ఓం

లోక లోకాలలో
ప్రాపు నా పేరు
సాకల్యముగ నిన్ను
సంస్కరించితిని
కథ చెప్పగానె
వాకట్టు కాదోయి !
తాకట్టు నీవు....నా
ధర్మాన్నె యుండు....

.... .... .... .... ....

శ్రీరామ రఘురామ
శ్రీ సీతారామా !
నన్ను మఱపింప
నీ
కున్న తావేది ?....

అవధరింపుము
అవధరింపుము
అంత నీకే తెలియగలదు
ఏ మంత ?
కనుచాటో !
పరాకో ? !....

వంశవర్ధనుడనో వివస్వంతుకన్న
మించువానిగ జేసె వాల్మీకి రచన
అతడు దక్షిణాయన యుత్తరాయణుండు
వర్తి రామాయణమ్ము హో! స్వామికథయ!

శ్రీ

# శ్రీ సీతాయణం

శ్రీ

రా మ చ రి త ము

ష ట్ప ద ము

ఓం

# శ్రీ రా మ చ రి తం

....

రామా !

నీ కథ బైటపెట్టిన వా
ల్మీకికి మాతోటి కవెనుమీ కల్పనకేం ?
నా కలములోని సత్తా
నీ కగపడునా కగపడనేరవయ్యెనన్
నీ పుట్టువు తెలిసినవా
రే పుడమిజపేరి సీత రీతెఱుగరు ని
న్నా పూబోణి చేబట్టుట
నే పూత చరిత్రుడనిరి గానీ నిర్గుణుడా !
నే నగల తీరులయే
రై నాయనగలరెవారు యాచకులైతే
నీనాచను విప్పటిదా?
యేనాటిదొ చెప్పుమోయి యినకుల తిలకా !

రాముడన్నా
కృష్ణుడన్నా
నారాయణుడే యని యెఱుగుదు –
కానీ ––
శ్రీ రాముడేయిష్టం ....
రామా ! నామది నిండుము
సామాన్యులకలవిగాని చరితమ్మట ! హం
గామా సంసారిగ నీ
వేమేమో చేసినట్టి వెల్లసెపుదునా ?

నీ వెన్నెసీడలో
నీలిపరదాలలో
నిలిచి కన్నైగనిన్
నిలుపుకొను దెవరొహో !!!

....

జాబిల్లి చాందినీ
సామగాన వితర్ది
అలతినవ్వుల జాణ
కలకంఠి ఎవరహో !!

...

మధుమాలతీ వధూ
మాంగళ్య డోలికా
మధురహర్ష వినోద
శ్రీధరుండెవరహో !

నరుడు నారాయణుడును
మా కిరువురుయొక రూప; రచన
లీశ్వరబుద్ధి . . నిద్దరికిచ్చితి
సంస్కృతి సరికావా ?
లేవు భేరసారములిందున్ ....

రాము కథ మాకు సంతోషప్రదము · విన్న
రామునే విందు మన్యమ్ము రాజసమ్ము
మధుచవి పరాగధూళి యత్యధిక భోగ
లాలసములైన కథలు కల్లలును కలలు....
పూర్వపక్షికి యలవాటు బోమదీయ
గొంతు హృద్యప్రపద్యచపుల పొంత మెలగు
ఆర్యదీప్తి సుధామనోహరపు ఫణితి
పాటు బొక్కింతు రచనా పరిభాషగరిమ
సత్యశీలు ప్రసంగ ప్రసన్న కావ్య
మంగళాచరణమున నిమంత్రితులము
నిండు మనసున తాలమే నిండుకొనిమె
నిత్యమధుమాసరథనేమి నిర్వచనము
అలరుల మేలుకొల్పి మధుపొంగన గీతము
లాలకించి
విందుల బుషి హేళిపిల్పున విదూషకు
కోకిల నిల్వారించి
గోపులమెయితట్టి పిల్లలనవోదయ
లాస్య విలాస హాస్య
రంగుల ధుని తీర్థమాడె యిదిగో
కవి గొంతువసంతరాగముల్....

ఎవరికోసం .... ఎందుకనినా
తపన అంతా .... ధర్మమంతా ?!

... ...

హాయిచెందీ ... హ్లాదమొందీ
బ్రతుకునీడల .... వ్రతము రామా !
పలుకు రుచి వంటకపురుచి
కులుకుటెడద, శుచి ప్రధానమ్ములగు
కృతిరచన —
తన వికాసమునకైన రుచి;
యింటివాని శీలపరులయునికిచే రుచి;
శుచిబాల్య పరిధి:

నిగ్రహానుగ్రహాది మనీషతలకు
పేరుగల రామునే తలచేరు; గాని,
వర్తి శృంగారచేష్టలబట్టి —
చరణకమల
మధుమత్తులై తిరుగాడువారె ?

నన్ను పద్యాలె వ్రాయమన్నారు:
కాని,
పదముగట్టుట పాటలు పాడుటన్న
జిలుగువలె వాటు సవరించుకలన
మధుర
హాసచంద్రిక గిలిగింతలగును నాకు

శ్రీ

# రా మ స్వ యం వ ర ము

అనుజన్ములూ నఖురూ — ఆ రోజె
ఆవిర్భవించారుగా !
ఇదియేమి దశరథునకూ — నీపైనె
ఇంతగా మమకారము ! — నీపైన
ఈగ వ్రాలగ నివ్వడూ !!
ఉన్న రాకొమరులందూ — నీపైన
ఊరివారికీ మమతలా ? !
ఎఱుగరా పసికందులూ — చెన్నెలూ
ఏలా అభివర్ణించిరీ !
ఒక్కడవె .... నీవొక్కడవె
దాశరథివా ? ........ ప్రజలంతా
ఓహోహో యనుటిదేమి
ఔనన్న కొడుకువనుచూ — మనసులో
అందరికి తట్టెనోపూ !

'అహమస్మి' ... యని నేనునూ - నీ చరిత
యందునూ వినగరమ్మా ....

తల్లులు మువ్వురు ... తండ్రి యొక్కడూ
తనయులు నల్వురు - మీరూ - రామ !

....

రాజూ నిన్నే రాణులు నిన్నే
మోజుగ పెంచిరటే ! — ఎంతో —
తాజా పువ్వవటే !

దశరథుడయ్యా ... తనయుల విద్యకు
తాపసి నేర్పరచే —వసిష్ఠుడు

ధర్మమె బోధించె
కాకుత్సవంశానికీ — గారాబుపట్టివనుచు
కైక సుమిత్రిలు కూడనూ - నీయందె
కళ్లుంచుకొన్నారటే ! ?
అనుజులె గాకుండా
అందరి పిల్లలునూ
వినిరటె నీ మాటె - ఆటల్లో
కనిరటె నీ వైపే !

అందరి నోళ్లల్లో
ఎందుకు పడ్డావో !
అంత చిన్నతనాన్నే - శ్రీరామ !
వింతయో నీ జన్మ ! ! !

నిన్నే కోరాడట ! తన
జన్మము కాపాడ రణవిశారద ఋషి
మీ నాన్నకు హడలెత్తిందేం !
నిన్నా విలుకాడు శిష్యునిగ వరించెనుబో !

మునివరుతో జనుమని యంపుతు
లక్ష్మణుజతచేసె నుక్ష్మాపాలుడు
నీ కంగరక్షకుడుగా .... కానలరక్కసి
మూకల జెక్కాడ .... చిన్ననాటనె
తనయుల విడదీసిన తండ్రిరా !
తక్కినవారలు తమ్ములుకారా ?
నిక్కపు ప్రేమలు నీపై లేవా ?

పాదచారివగుట కదె మొదలుగద
యిష్టపడి తండ్రి గురు వసిష్ఠానుమతిని

కౌశికుండు జేయగల్గు లాభము
నెంచగానె నీ వియోగమూనె రాజు . .

గాధినందను యజ్ఞరక్షణ
నెపమున -
నీదు వనవాసమునకు పునాది
పడియె -
వినరిపైచి మారీచుకవ్వించి
విడచి -
రాక్షస విరోధమునకు ప్రారంభివైతి

ఊనషోడశవర్ష ప్రాయుణ్ణి నిన్ను
అడవి తృణశయ్యా ఫలములాహారములుగ
రాజ మునివెంట బంపగా
రాజు హడలె .... కాని ....
నీ కన్న చిన్న లక్ష్మణుడు కాడో !

విశ్వామిత్రుని వెంట నడుస్తూ
ఆశ్రమ చరితము లాకర్ణిస్తూ
సెలయేళ్లకు వంపులు తీరుస్తూ
మలయానిలు కమ్మగ పాడిస్తూ

మధురహాసదామముపచరిస్తూ
మిథిలానగరము మీది తలపులో
చదివావా నీ జనకు హృదయము
తలచావా నీ తల్లిని రామా !!

విశ్వామిత్రుని మాటబట్టుకొని
విఱిచావా శివకార్ముకము !
తండ్రినడిగావా నీ తల్లినడిగావా ?
ధర్మపత్ని విషయంలో పెద్దలు చూసే
దేమనుకున్నావా ?
పెళ్లివేడుకలకు మాత్రం
మీవాళ్లంతా రావాలా !
పెళ్లాం వచ్చేసరికల్లా ఒళ్లు తెలియని
ధర్మం కాబోలేం ?
సీత యెట్టిదో నీకేరు చెప్పినారు
హంస చిలుకల రాయబారమ్మ లేదె !
జనకునకు భూమిలో మందసమున దొరకె
ఆ అయోనిజాసతి ! కౌసల్యా సుపుత్రి !

నే నబద్ధుడ వ్యాకర

ణానికి స్వస్తి భావలయగుణాను

కూలవతి భా

షానియమాలూ కవితా

మానాలు సున్న కావ్యమతమిది

నాకున్.

ఎడమచేత సీత ఎత్తి పడేసింది
భవుని విల్లు మున్నే; భార్యజేసి
కొనగనామె, దాని తునియలు చేశావు
భర్తబాధ్యతల సవాలు నీకు

జనకుడు జ్ఞాని కా
వున భూమిజను కా
బోపురాజుచేత వుస్తె కట్టించాడు....
ఇల యేలికకు ధరణి
ఏమి కావలెనో ?
దాశరథి ధర్మాలు
ఈశుడే పొగడాలి !
అవతరించక తప్ప
దయ్యె నీ వవని
అవని జా నామ స్వ
యంభవ ఆమె ! !

నినె కోరగలేము సీత
మ్మను కోరుకవచ్చి జనకుమాటను నెగ్గిం
చిన ధీరుడవని సీ పా
ణిని పట్టిన శీలయాపె నీతికి జే జే !

సీతకనుగల్వ పుల్కరించినది వెన్నె
లా సురభిళానంద మరీచి లాస్యమాల
నీదు కనుదమ్మి వెల్వరించింది మత్త
మధువినీల భృంగరస వన్మంజులార్తి

నీవెతలవంచ జానకిభావకుంద
మాలికాలంకృతగ్రీవ మంజులార్ద్రు
జేసె; సూర్యవంశమున రాజేశ్వరినిగ
జేయు నీ చూపు యాహ్వానశ్రీ నివాళి....

మైథిలీరూప చిత్రి సంబంధివగుచు
కేలకేలుగిలించి యంకితమొనర్చి
తమ్మిఱేకుల కళ్ల సీతమ్మ పేరు
తో వెలుగుపడె నీ చరితోద్రిదయముకు

శివుని విల్లు విఱిచి చేబట్టినా, అయో
ధ్యాపురీశు కొడుకువనిరె నిన్ను ?
వీధివారలెల్ల వేలెత్తి చూపించి
'సీత మొగుడె'! యంచు చెప్పుకొనిరి !!

జనకరాజ సుతను జడదారి చెప్పగా
వలచి వచ్చి యొప్పువలకు సిద్ధ
పడిన పెద్దలన్న భయభక్తులున్నవా
డనుచు శుభము జఱపికొనిరి.

దిక్కు_దుమనకుండా నీ
తక్కిన తమ్ములకుకూడ తలకోనారి
చుక్కను యిప్పించితివట
పక్కాలౌక్యుడవు రామభద్రా శహబాష్ !

మగవాళ్ళల్లో యింతటి
సొగసుకాడు లేడటన్న సుందరులంతా
దిగదుడుపే చేరెడు క
ళ్లగు జానకి చూపు వెల్గులందు నివాళే

మామయగుట జనక మహారాజు
నీ కాళ్లు కడిగి దానమిచ్చె కన్యనంతె
కాని.... బ్రహ్మపదమునేని యాశింపని
జ్ఞాని ! ఆడపిల్లననుప యింతె ! !

అన్నీ వడిలేసినట్టి
సన్యాసులు మేళంకట్టే
కాంతాకనకాలూ రోసి
పంతాలకు దిగినట్టివారూ
కన్యకై కళ్యాణము చేశారు
విన్నారా యీ విధమగు పెళ్లి
కన్నారా సీతాకళ్యాణం !

ఆర్య సంతాన మంచు
భార్యాభర్తలమంచు
భూమిలో దొరకిన పిల్లకు
భూజానికొడుకుకు పెళ్లి
విన్నారా యీ గాథంతా
జన్నాల పండితులంతా

సీతమ్మకు సిగపూవైనాడు
శ్రీరాముడు; జానకి
రఘురాముని మెడలో హారమ్ము
సీతమ్మకు చెంగల్వలూ
శ్రీరాముకు చేమంతులూ

కరవీర విరజాజులూ

మల్లెపూ మాధుర్యాలు

పిల్లతెమ్మెరల పొన్నులు

కవి....వాగ్రితల....కాన్కలు

సవినయ రసాళులు

సీతాకళ్యాణ విశేషాలు

మనకివి యంతా

ప్రాగ్రితాకొగ్రిత్తల పంథాలు

శుభమస్తు

దిగ్విజయమస్తు

శృంగారమస్తు

వసిష్ఠుడూ విశ్వామిత్రుడూ
వర్షించారుగా మీ కాశీస్సులూ
హర్షించారుగా మీ దాంపత్యం
జనకుడూ శతానందుడూ
సాగనంపారో లేదో యింకా
ఈగవాళ్ళిలదనుకున్నారో యేమో !

నిను కట్టుకున్న సుఖమూ
కనె సీత భార్గవు పేచీలో
రాజగృహ వ్రివేశమై నీ
రాజధానిని యున్నరోజుల
పుట్టినింటికి సీత నంపితివా ?
చుట్టపు చూపులకైనా
బొ త్తిగా వెళ్లావుకాదే !
అత్తమామల క్షేమమరసితివా ?

నిను యొక యింటివానిగ
జేసిన పున్నెము దక్కె-రాజర్షివల్లభునకా
తని పేరెత్తవు....నీకిచ్చిన
యతిబలమహాబలాస్త్రచేవకు ఫలమా ?

రాజమాన్య రాజపూజిత
రాజముఖ దినరాజతేజా !

సంగీతస్వరమార్దవ
శృంగారార్ద్ర పదశుభా
పొంగా ! రసనాంచల మృదులయ
భంగా ! సుశ్లోక రామభద్ర శుభాంగా !

నీలమేఘశ్యామా !
నిరుపమ గుణధామా !
పూలపుత్తడి బొమ్మా !
ఆలినీకమరెను సుమ్మా

పాట పద్యాల నీ పెండ్లి నాటకమ్ము
పదవిభాగమ్ముజేసి రామాయణమ్ము
కాదు; సీతాయణమ్మని కథనడిపితి
ధర్మసూక్షము పల్కనంతసము కాదె

తల్లి పేరుతో రామా!
తండ్రి పేరిట భామా!
సూర్యవంశపు సోమా!
సుమతి హారతికొమ్మా!

ప్రిసన్నతాలోల పరమాప్త శీలా
పరమేశులీల రవ్వాల హారతీ జై
అంతుపొంతూ లేని ఆదర్శ చరితా
కాంత సంతాప నిశ్చింత మంగళ జై
విశ్వమోహన రూప వీర చారిత్రి
శాశ్వతానంద దృశ్యానివాళి జై

అనసూయకు పుట్టిన మే
నత్రివంశజులము; సూర్యా
నారాయణకవి పల్కిన
శ్రీరామస్వయంవర కథ

ఓం తత్సత్
శ్రీ శ్రీ శ్రీ

చిన్ననాటను అమ్మమ్మ చెప్పినట్టి
కథల ఫలితమ్ము యిన్నాళ్లుగా యొకప్పు
డైన కన్పడకుండువాయని యిట్లైతి
చెప్పి, విని, పాడితిని నాకుముప్పుదరిసె.

రామ నీగీతి యాలాపనమ్ము
చేస్తు
విడుతు నీ దేహమపుడ నే
నుడువు మాట
పాట పద్యాల నిజమంత
బైటపడును

చెమ్మగిలుకళ్ల
యపుడేమి
సేయగలవు ?

నీ కోసమే నేను
నిలువు దోపిడియైతి
నిముసమైనా యిచట
నిలిచి మాటాడవా ?

పూలబుక్కా చిమ్మి
పాల పదముల నమ్మి
తలపు మాధుర్యాల
దారి వడి వడబడితి

ప్రీతి నెలా పల్కరిం
చితి పొంగుపొరలు నా
పక్షమే చెప్పవా
సాక్షి నా బ్రతుకు కథ !

# శ్రీ రా మ చ రి త ము



## రా జ ప్రా సా ద ము



కావ్యస్రష్ట

అత్తిలి సూర్యనారాయణమూర్తి

# అంకితం

ఇంకు కొంకులేక సబబు చెప్పేవాడు
మాట తిఱుగలేని మానధనుడు
అవుసరాలకెపుడు ఆదుకునేవాడు
వీరరాఘవులకు లేరుసాటి

మా
తాతయ్య
మామకు
చిన్నారి తమ్మునికి

పట్టి యడియాసను నివాళి బట్టబోవు
పట్టు విడుపుల నెఱిగినదిట్టు; రాజ
కీయ చాతురీత్యాగ చికిత్సకుడవు
ఆప్తుడవు తటవర్తి కృష్ణా శుభమ్ము

# రాజప్రాసాదము

కౌసికుని పెండ్లి పెద్దగ గౌరవించి
రమ్మనిరె మీ గృహప్రవేశమ్ముజూడ
పిలుపు సనిలేకనో ఋషితిలకుడేల
రాడు మీతోడ మీ యింటివేడుకలకు ?

దారి తప్పించి మీరయోధ్యాపురమ్ము
చేరిరా ? గౌతముని సతిచెప్పకున్న
సీతతో జాతనాతిగజేయు నీదు
మాంత్రికపు విద్య ? మరిసేయుమన్న సుఖవె ?

ఇల్లాలికీ నీకూ వేరే
ఇల్లా యువకులకు హితవిదేనా రామా !
తల్లీ తండ్రియుండే
ఇల్లు కొడుకుకోడలుంటె యిఋకోయేమో ?

నీదు శృంగార చేష్టలన్నిటికి వనమె
మూలకందమయోధ్య నేమూలవిన్న
ధర్మరూపిగ సుగుణడత్యంత సన్ని
హితుడుగా చెప్పుకొనిరి నీకత నెఋగక

నీ వయోభ్యాప్రరిని యున్నావు కొంత
కాలమైనను యేవిశేషాలు లేవు
అడవిబడితివా లేదా నీయంతవాడు
లేడనగ పేరుపచ్చావులెమ్మ రామా !

కఠిన బ్రహ్మచర్య
కాంతారవాసమ్ము
కనులముందు ముందు
గానె నాట్యమాడె నేమొ
సీత నీడలాగే యున్న
పూలభరిణె ఫలముపొందెనటవె ?

రాణివాసాలలోని వారలకు యెప్పు
డేమిజఱిగునోయను భీతియే కదండి !
తెలియడారాజు సరిసమానులుగ ముప్వ
రాండ్రమధ్యను సరస పరాజయమ్ము

వట్టి గొడ్రాళ్లుగాయున్నయట్టి కాల
మందు పొరపొచ్చెములకేమి యిందువదన
చంద్రవదనంచువారినాశ్వాస పర్చె
వారి కడుపు ఫలించు తర్వాత కథలొ ?

వినలేదా ధృవుచరితము
కనలేదా లోకమెట్టిగతి నడచునో దా
యనుకోడా రామా నిన్నొ
క్కని ప్రేమకు నిలయుజేయకలిగే వింతల్

కలలు దుర్నిమిత్తములుతోచె రాజుకు
గాని తోచలేదె తానెతెచ్చు
కొన్న శాపవిధిని ? కొడుకులుకల్గు ఆ
శయ తనంతవాని శాంతినడచె....

రాజటు ! అనుభవశాలటు !
రాజుకొనెడు పొగలు సవతిరాణులలో యే
వ్యాజము దొరకిన మండవె ?
బూజువడినె ముసలిరాజబుద్ధివిశేషం

అంతఃపురాలలో
అరణమొచ్చిన స్త్రీల
చాకచక్యమున రా
జ్యాలు తలక్రిందౌను

ఆ మాత్రమెఱుగడా
మీ తండ్రి రామ !
అధికారముకు ప్రజలా
పడియుండా ?

మాటనిచ్చినవాడు
మనసు నిచ్చినవాడు
నిర్మలమ్మగు ప్రేమ
నీపైనెయుంచేను
కైకమ్మతో సరా
గమ్మకేమంతపని ?
రాజప్రాసాదాల
రాజకీయము లెఱుగడా ;
మీ నాన్న
మంత్రాగమే తెలియడా ?
భరతుడేయున్న నీ
పట్టాభిషేకమ్మ
వద్దన్న కైకమ్మ
సుద్దు వినువారెవరు ?
ప్రేమపద్ధతులెఱుగడా ?
మీ బాబు
జేలగా వాపోవునా ?

తండ్రి ఆజ్ఞలేదు తల్లిచెప్పాలేదు
హితు సుమంతు నడిగితే ? తమాము
వినని కైకమాట విన్నావు జన్నావు
గురువుకన్న ధర్మకోవిదుడవె ? !

మునులతోడ తిఋగు మోజున్న నీకెదో
నెపము వలసె రాజనీతి హృదయ
వాదములకు పేచివచ్చింది ధర్మ ని
ర్వచన మొకటి వెలసె రాము పేర !

దశరథేశ్వరుగొంతు వశముగానప్పుడు
ఊరివారలెల్ల హోరుమనగ
తమ్ముకుఋనేని తండ్రికడ నుంచక
భార్యవెంటబడగ పయనమైతె ? !

పట్టాభిషేక మహోత్సవమ్మని
మొదట.........వనవాసపారిరంభో
త్సవమ్మని వెన్క
ఉన్నదెల్లా ఊడ్చిపెట్టేశావంట
నిన్నె మెచ్చుకుంటూ నిన్నె కోరగ ప్రజలు
అనురాగవల్లరీ ఆర్తనాదాలమధ్యను

పౌరులను మభ్యపర్చగానేల ?
తనివిగా నినుజూడకుండ షోనేల ?

పశువుల్లైనిలచె పక్షులామెదలవు
కాని, గుహుడు మిమ్ముగంగదాట
జెసె; యీ 'షరీకు' చీమంత తెలిసినా
స్వామివారి కోర్కె సాగుటెట్లు ?
మీరయోధ్య ప్రజల మీరగలరె ?

బలపత్త్ర కారణమే
తలపెట్టక యున్న గృహిణీ ధర్మముపేరన్
కలరుకదా ముప్వురు భా
ర్యాలు మీ తండ్రికి కౌసల్యను ఆపితివేం ?

తల్లికంటెను భార్యాపదమ్ముబలువు
హితము; నీ తల్లి యొకతెగా
సుతుడు దూరమవగ వాపోవ ?
మిగిలిన సవతి
రాణులందు ?
ఇది మాతృసేవా పసందొ యేమొ ?

ఒక్కతే రాణిగాయున్న యొప్పుగాని
సంఖ్య పెఱిగినకొద్ది రాజ్యాలకెసరె!!
మూలసూత్రమ్ము లెఱుగు రసాలవాల!
ఏకపత్నీ వ్రతమ్ము కిదేమొకిటుకు?

అన్నవని ప్రేమ నీపైనె అనుజులకును
నాన్న వరములు పాలించినది యొకడవె
రామ రామా యనెడు నీనామమొకటె
దశరథుని నాల్కనుంట యందరికిహితవె!

జనకసుతా రాముచూసి కొమ్మనుచు లక్ష్మ
ణునికి బోధించె శత్రుఘ్ననని షె భరతు
తో యిదే రాజకీయ చాతురికి సాక్షి
రాణులందు సుమిత్రి సర్వజ్ఞ సుమతి——

కవల విడదీసి యొకనికై కమ్మసుతుని
కంటగట్టి సీతోయుంచుకొంటి వొకని
నిన్ను కాదనువారు లేరన్నమాటె!
అడవిలోనున్న నీదు రాజ్యమ్మె యనరె?

నీదు పెండ్లాము మాట చెల్లిందిగాని
ఆమె చెల్లింపు నెవరైన యడిగినారె?
రాజ, యువరాజ దేవేరులై జనించి
ప్రేమకిఱవైన నెఱవేఱకేమి, పనులు?!

తప్పు దశరథునిదియని చెప్పలేవ
ప్రజలు నీకాళ్ళవేళ్ళను పడగలేవ?
నీ తలంపునకేగాని నిన్నెనమ్మి
కొన్నవారికి విలువలు నున్నయేమొ?!

పిచ్చితల్లి కౌశల్యకేవిధము తెలియ
బోదు; కనుకనే యామె నీపుల్లవిఱుపు
వాక్య సరళిని వేద ప్రవచనముగను
నమ్మె; మనసుండిమాటులే నట్టిబొమ్మ

కొలువు కూటాన్న దశరథుకోర్కెంతొ
మద్దతిచ్చిన వారలేమైరొ? రాజు
తప్పుకో తలలూపిరే! యొప్పుకొనిరి
నీదు ధర్మమె; తిఱుగుబాటేది రామ!

ఇంతవసిష్ఠుడూ యేమిచేశాడు ?
సుంతైన వినని నీ పంతమెనెగ్గె ........

దైవమే కలసిరాదను తెలియుహెంతె
నీ వయోధ్యనువీడు నిశ్చింత తెలిపె

కానిమ్ము నీకథ కాననసీమ
కనపడునులెమ్ము 'నిఘా' లేదుపొమ్ము

మేఘపటలీ మేనువాడా !
రాఘవా ! నీరాణి తొలకరి
మెరుపునా నీభావవల్లరి
విఱియ లక్ష్మణకాపుగాడా ?

చీకట్ల చిట్టడవి శ్రీరామనీవు
రాకాసుధాంశు వదానవై సీత
మార్గావరోధమ్ము మటుమాయమయ్యె
మాలిన్య రహిత లక్ష్మణునీతిపథము.

సరయూ గంగా సలిలవిహారా
కరవీరకోరక వికాసనఖాగ్రా !

సుమధురభాషా రసోల్లాససౌహార్ద్రా !
సుమహాసవదనమంజుల హాస్యవినోదా !

విశ్వమోహనరూప
మోహావర్జితరామా !
విబుధాపక్షీహృదయ
వినుతచారిత్రా !
విలంబమోర్వసుచైత్రి
కళాభిరామా ! రామా !

విమలా ! సదమలాపాంగా !
కమలాకమనీయ పదశుభాంగా !

మహోదార గంభీర మహనీయసుప్రసన్నా !
అహంకార శూన్యా ; ఆహ్లాద మాన్యా !

రాజతంత్రపరివీణ గ్రంథప్రపణ
జీవులర్థ విహీనుల చీకటిగొన
నట్టిముదితాత్ముడగు రవినై ననస్సు
సూర్యనారాయణుని మనసుకసురామ

వినుత కొడుకువలన తనదాసితనము పో
గొట్టుకొనగజాలె; పట్టులేదు
శాపవశతనుంటి చావొక్కటేశుద్ధ
మోక్షమిచ్చు! రామముగ్ధనగుట ........

ఆదర్శవాద ప్రదర్శకా మంగళం
నీధర్మనాపేక్ష నిల్చుమాకూ శుభం—
శిష్టవ్యవహార విశిష్టానుచరా మంగళం—
నిష్ఠగానిను చెప్పితుష్టిగొను మాకూశుభం—

నిత్యకళ్యాణమూ
సత్యపరివర్తనమూ
నెత్తావి చరితమూ
గుత్తగొంటివిరామా!

నిన్ను అన్నానని
నన్నూకాదనగలవా?
వీనులవిందూ మనకీ
వేళ యీసంభాషణ
రామా నీ కులుకు పలికెదను
రఘురామా నీదగు
భామా చరితమ్మనియెదను.

స రి కి స రి
గ రా గ రి

ఓం తత్సత్
శ్రీ శ్రీ శ్రీ

తెలతెలవారుచున్నది
మదీయమన స్తిమిరావృతంపు
రేఖల కలవిచ్చు జాడల
వికాశము అల్లదె
చేయుచుండు కర్మలమలినమ్ము
షోనడచి మార్గ సుగమ్యుడనై
మహావినోద లలితప్రసక్తి
అనుతాప విముక్తుడ నౌదు
హాయిగా

ఓం.

# శ్రీ రామ చరితము



## చిత్రకూటము



రచయిత

అత్తిలి సూర్యనారాయణుడు

# ఇ ది గో

మాట అనడు పడడు మర్యాదకై

ద ం డు మా మ !

గుట్టుజీవి మచ్చలేని జీవితమ్ముకొఱకు

శిక్షించుకొను

మ ం చి వా డు

హితుడు మమ్ము పదలలేదు —

అందుకే

యీ కా న్క

# చిత్రకూటము

అప్పటి రోజుల్లో
ఆమాత్రిపు దూరంలో
అన్నీ అడవులె మీ
రందుకె యొప్పితిరేమొ?
వదలితి వేయను అయోధ్యను
కదలితి వేయను కాఱడవికి
ఏ రాయిడి లేకుండా
వారూ వీరూ రాకుండా
వెళ్లావా కనబడకుండా
ఊళ్లో సంగతి వినబడకుండా?

పూలుపత్రాలుతెచ్చి పాన్పులసమర్చి
కందమూల ఫలాదులకై వనమ్ము
తిఱుగ సౌమిత్రి గడపవాటెఱుగవీవు
లాతివానిగజేసిన రీతిగాదె —

భార్య దగ్గరున్నవాడవు నీవైతె
ఇంటివిడిచివచ్చి యిచటపూలు
లేచిగుళ్లుఫలములేర్చి తెచ్చుటనవా
లక్ష్మణుడు పరీక్షలందు జిక్కె

దారులన్నియు బాగుచేశారు; నిన్ను కలుసు
కోగోరు భరతుయాగమనమునకు
భరతు పరిపాలనము యే పగిదినుందో
తెలిసికోగోరు నీ కిది వలలోచేప ....

సర్వసైన్యాలు వదలియాశ్రమము పొంత
కఱగుదేటెంధూ? చీకట్లు యలమె
లక్ష్మణుని యాగ్రహము మెర్పులాధ్వనించె
భరతురాక నీ రాజ్య సుస్థిరతపూచె —

ఊరిచిముట్టుగ యూరిలో నున్నవార
తెల్లవిచ్చేసినారు నీ తల్లి నెదుట
బెట్టుకొని; శోకమూర్తి కన్పట్టు విధము
తండ్రిలేడని తెలిసి స్వాస్థత యుదేల ?

ప్రజలకై పుట్టినట్టి దైవమ్ము నీవు
నీకుగా ప్రజయనుట యెన్నెన్నొసార్లు
జయటపడె; కానియెడ యొక్కవ్యక్తిగాని
మారుమాటాడలేదు నీ మాటలకును

భరతునెత్తిని పెట్టి నీ పాదుకలను
రత్నఖచిత కిరీటధారణము సేయు
తల, ప్రజాప్రతినిధిగ సుందరత యొప్పు
రీతి గైసేసి పాలించురీతి నీదె !

గురుడు కైకమ్మచెప్పి చూసిరికదయ్యా
వినవు, తిరిగయోధ్యకు వెళ్లబోవు
భరతు హృదయమ్ము తెలుసు నీ ప్రజలనెఱుగు
దైన యడవివీడవుగ తాత్పర్యమేమి ?

ప్రజల, భటుల, సామంత, సిబ్బందినెటుల
చూడతగుచెప్పి యనుజు మారాడకుండ
జేసిప్రజయొప్పుదల రాజదాసరికము
విడబఱుచపునఃరాముడేయొడయుడనరె ?

ఊరడిల్లినారు యూరివారంతాను
యూరడిల్లె భరతుడూరడిల్లె
లక్ష్మణుండు; సీతలక్షణ మెట్టిదో
కనులబేడిసలకు గాలమైతి

అనుజులందరిపైన యత్యంత ప్రేమ
యన్న దెలుగెత్తి చాటావు, కన్నవార
లందరును నీదు ధర్మైకలక్ష్యశుద్ధి
కోరి రేగాని నీప్రజ వేరు; ఋషులు

కాదన్న కైకమ్మ
వాదు వదలించి
నిన్నె కోరిన ప్రజల
వన్నె వాసించి
గురుని కోర్కె తండ్రి
కోర్కె తీర్చింది
పితృవచనములు తీర్చు
పేరు వచ్చింది
వివిధభావాల తిర్రి
వేణి కూడింది

భావసంబంధ ని
వాళి పట్టింది
చిత్రికహాటము నిన్ను
చేరికొల్పింది

కైకకొడుకె రాజుగాని, నీ ప్రతినిధి
పడగవిప్పలేని ప్రజల బుసలు
నిజము నీమ పథమె సతిగా జెల్లె కౌ
సల్య గుండె పీకు శల్యమాడె !

సంకసించె కైక, వింతపోకిళ్లు షో
కుండ ప్రజల నణగకొట్టినావు
పౌరులంత నీదు పాదుకా పట్టాభి
షేకమనుట సంతసించినారె ! ?

కాలిచెప్పులు నీవు యెక్కడవె తెచ్చు
కొంటివా లక్ష్మణునికి లేకుంటగనవె !
తిరిగిరావని తెచ్చి మీ భరతుడాడె
నా విచిత్రకూటపు మహానాటకమ్ము !

భరతుడెరుగక పోలేదు పరిజల పక్ష
పాతమెట్లునూ పదునాల్గు వత్సరాలె !
రాము పేరిట రాజ్యమ్ము రాజు తాను
కంటకములేని పుష్పసంగ్రహణ మిదియ!

నిన్నె అంటిపెట్టుకొన్నట్టి లక్ష్మణు
భార్యకురులు చిక్కువడకపోవు
భరతుతోడ నున్నఫలము శత్రుఘ్ను హ
స్తములు పూల ముడుపు సమత విధులు

మొగుడులేని యత్తమొగుడు వీడిన కోడ
లెట్టులొకరి నొకరు యూరడించు
కొనిరొ ! ? కైకగూడ కోడలితో యింట
కుములు వారిత కన్నకొడుకె దెచ్చె

పితృవాక్య పరిపాలనా విధి విదుడవు
కైకకొడుకుకు పట్టాభిషేకమేది ?
రాజుమాటకు విలువ పోరాదు ప్రజల
మాటకెదురాడరాని రామాయణమ్ము

నిన్ను వనవాసమును జేయుమన్న ఫలము
భరతు కుగ్రామవాసు జేసిరికదయ్యా
దశరథుడు చూపుయానునందాక నిన్ను
చూచి కనుమూసె యిదియ నీ మంచితనము

చెంగనాడవు సవతి తల్లిని
భంగపుచ్చవు ప్రజల కోర్కెలు
మంగళాచరణమ్ము జేస్తివి
హంగుగా నీ పాదుకలె ఏలున్
మాటయిచ్చి మనసునిచ్చి
దాటలేదే దశరథుండూ!
చాటునుండిన ఆట నీదే
పాటవము నీ ప్రతిన జాలమ్ముల్
ఆడదానికి వరములిస్తే
త్రాడుబొంగరమేమి లేకయ
బోడిగోడల బొమ్మలాసై
గోడుచెడి నాకోర్కెలై పోయెన్....

తమ్ములందరు కూడునందాకయుండి
ఇన్ని నాళ్లుగ చిత్రకూటాన్న యంత
దండకాటవి ఋషుల సందర్శనమ్ము
తోచెకాపోలు రాచవిధ్యుక్త చర్య

జానకీమౌన, భావ పంజరపు చిలుక
భాష్యమైయొప్పు నీ ధర్మపరత వదినె
ప్రాపకము యూత లక్ష్మణుబడల నీదు
అవనిజకు పృథ్విపై నడయాడుటెంత ?!

పతివిహీనలు తనయులా పద్దలేరు
పొరుబత్తేప్పు జీవిత భరణ తనులు
కోసలేంద్రుని రాణులు కోటలోన
పూలుకాలిన తీవెలందాల గనులు

చిత్రకూట సమాకర్ష మిత్రకోటి
వారివారికిగల ప్రేమబంధనముల
వచ్చిపోయెడి విధము తగ్గించవచ్చు
మంచిదుభయత్రయని దూరమగుట తలతె ?!

రాజధాని వీడి రాజభోగాలు లే
కుండజేసి; చిత్రకూటమునకు
సరసధ్వని పతాక విరుల పందిరికట్టి
ఇనకులేశ యూడ్చియేగు వేళ ?

పత్రపుష్ప శోభితము మీ ప్రథమ మజిలి
పూలబుట్ట సమారాధనాలయమ్మ
అందిపుచ్చుకోగల దూరమందు నిలక
బంధుపీడను పసిగట్టి పాఱిపోతె ? !

విభూతీ వినోదం విమోహం విరాగం
సభూతో సభవిష్యద్ఘనాహంగరాగం
సభాసంస్తుతివాక్సరోజాత భృంగం
నభోమణీ వంశనమోసుందరాంగం

విమతా కుమత వినాశం
సమతా స్వమత ప్రకాశం

విమలా మలిన హృద్విచ్ఛేదం
భ్రమలా విభ్రవ పదపరిచ్ఛేదం

సదా మోద సంకాశనివాఘ ప్రతాపా
సుధామాధురీ వాక్సునాశీరుచాపా
మదాళీభూరికటీలోక మర్యాద రూపా
ప్రధానాంతరంగ పరిబోధ ప్రకోపా !



కధలు పద్యాలు పాటలేకాంకికలను
ఉభయ భాషలవ్రాస్తి మా సభలు రక్తి
కట్టునన్న పేరుకల్గె చక్కటి హిత
వర్గబలగమున్నవాడ నగుట

.... .... ....

చేసి చేసి యెంతచేసినా శాంతి పరి
సన్నతలకు మనసు సమయుచుండె
మూలమంచు విధుల మూల పడేశాను
లేరు నన్ను తెలియువారు రామ !!

నిత్యం పథ్యం సత్యమగత్యం
వందేరాఘవ చరిత ప్రశాంతం

స్వస్తి సీతాపురాణీ
స్వస్తిశ్రీ రామధ్యానీ
స్వస్తి విచికిత్స శూన్యా
స్వస్తి విశిష్టమూర్ధన్యా !

కాలము చెల్లిపోయె సమకాలికు
లెందరో మాసినారు
యేవేళనో యెచ్చటో విడిచి పెట్టగ
నుంటి శరీర
మింతలోనేల ?
ప్రతాప వాఙ్మయ మనీషత ?
కీర్త్యుపకీర్తు లెంచుకోవాలను
యాశ లేదు ........ పరమాత్మయె
నవ్వుల జిల్కునంతటన్ ....

వదలి పోయిన వయసు
చెదరిపోయిన మనసు
కదలి నా యెదలోన
ఒదులు యొదుల్మై పలుకు

ఆకాశ తీఱాన్న
జోకొట్టుకళ్లలో
ఊఁకొట్టుదెవరహో
నాకథని పొత్తిళ్ల ?

గోరింట గొబ్బిళ్ల
కొనగోళ్ల గిలిగింత
నేలకూ నింగికీ
గాలి తీగల లేఖ

ముగుపు తెలిమోవిలో
సగము సగమ్మై వసం
తములు పొటమరించె నా
దమునదించెను నాలో....

# శ్రీ రా మ చ రి త ము



## దే వ ర హ స్యా ము



అ ర్ప ణ

అత్తిలి సూర్యనారాయణమూర్తి

# శు భ లే ఖ

## అ త్తి లి సీ తా సా వి త్రి కి



అడుగుతెఱుగవు అభిమానముడుగబోవు
ఇచ్చితివిగాని గైకొన్నదేమిలేదు
నీదు యభిరుచులడుగనేలేదు నేను
తెల్పి దేవరహస్యమ్ము; తీర్తు ఋణము.

నారదునిబోధ వాల్మీకి
తేరెవ్రాసి ..........
సూర్య వంశాన బుట్టు యాం
తర్యమిడగో
స్వామి నిఃశ్రేయసానంద రామకథకు
దివ్యచక్షువులిచ్చె యదే వచింతు.

# దేవరహస్యము

నీవు దాక్షిణ్యమున పయనించినావు
దండకాటవి ఋషుల బాధలను మాన్ప
కుడిచి కూర్చుండలేని నీ దుడుకు తనము
వింధ్యవైపునకే సాగుతుంది యేమొః!

సాధుజనులెల్ల నివసించు జాడలెల్ల
దక్షిణాపథమందె సాధారణముగ
సురలు తూర్పున పశ్చిమోత్తరములందు
వట్టి మరుభూమి మంచుకప్పెట్టు కొండ.

రాజుగా వారి దర్శించరాదొః ఋషులు
తప్త తపముననుండు సాధనలజూచి
చేత శరచాపములుగల్గు శాంతిమూర్త
వేషధారణ పదును గావించినావెః

దుర్గమారణ్యభూమి నెందులకొ మునులు
సాయసంపదలేని యాశ్రమములందు
క్రూరరాక్షస బాధ జిక్కువడుటెల్ల
దేహబంధములూడ్చ........విదేహముక్తి !!

తాపసి కుటీరముల దరిదాపులందు
సహజవైరము విడు మృగజాతులైతె
కాని సాత్త్వికశక్తి రాక్షసులపట్ల
నేటిచే మంటలార్పేటి నీతి పథము

గచ్చపొదలనడుకి కటుకుటాగమినెట్టి
కాలిబాట చదునుగా నొనర్చె
చరణభజన మీకు సౌమిత్రి పె
ద్దన్న భార్య తల్లి కన్న మిన్న.

అడవులందచ్చటచ్చట యాశ్రమముల
గట్టి సంఘజీవితము పోగొట్టుకొన్న
యతులు కోర నిశాచరతతిని గూల్చి
నీదు తమ్ముని నియమింప నీవు జేల

మునులె పట్టలేకపోయిరి నీ రూప
శీలవచఃపరిభావజాలమునకు
ముగ్ధులగుట తప్ప మోహావిదూర ని
ర్గుణవిరూపు తెలియు ఋషులు సకృతు

కాకులు దూరని కాఱడవుల్లో
చీమలు దూరని చిట్టడవుల్లో
మునులగావ నీ మునితను త్రిప్పి
పేరొందితివా పెనుకను గప్పి
తండ్రిమాట కాదనకవచ్చి తను
మాతేగా నీవేట దుష్టులను

స్వాయంనిర్ణయము సాధునిర్ణయము
పలుచోట్లకు పోవని సాధనము
ఒకచోటుంటే యూరే తలపుల
చీకుపోవవేసితివీ పథకము

ఎక్కడి గంగారణ్యము!
లెక్కడి గోదావరీ వనేందిర! మీకీ
చక్కనివాసము కనువా!
రక్కసి జనపథము దాపురాగతమేమీ?

మున్నగస్త్యుడు వింధ్య తనకై
మోకరించిన ఫలము యా
యున్నరీతినె చాప చుట్టుగ
యుండమని చనె యాతడీ

నున్నవరమో శాపమో మొల
నూలు భారత దేవికై
సన్నసన్నగ ఔత్తరాహులు
సాగి దక్షిణ మేలగా....

షట్టిగానొక గడిపెట్టు గట్టినారె
పర్ణశాలను నిర్మించు భావమేమి ?
ఎండలో వానలోపడి యుండుకాల
ముండడనుకొంటిరా శత్రులుండబట్టి

సెలయేళ్ల చిలిపి పల్కుల కలరె సీతమ్మ
ఫలమూల పత్రి పుష్పముల దలచె సౌమిత్రి
మలయాద్రి యూర్పుసామ్యముకొలచితివిరామ!
విలువిడచి యిలు నిలచు తలపుకల మొలచునా!

ఆటవికులందరూ కొనియాడువారె
గుండెపై చేయివేసుక కూర్కువీలు
నీధనుర్జ్యోత్రలకు దీర్ఘనిద్రిజెంద
దనుజతతి తాపసులు ధ్యానమున సుఖింత్రి ? !

సౌమ్యుడని ఋషిచంద్రులగమ్యుడంచు
రమ్యుడని విభుంతువవేఱు లార్ద్రిత గొనంగ
శాపరూప విశేష ప్రస్తావనముల
ముక్కుడుల దంచు మానసములు కలంగె

వచ్చి పనిపెట్టుకొని దానవాళినెల్ల
మారుమూలల నున్నట్టి వారి చంప
పగనుబూనిన వారెవ్వరును గాక
ప్రణతు లిడినట్టివారి సంవర్ధనముకె ?

పోరనారు నీపైకి వారూరి మధ్య
పడను లేదేల నీ కరవాలమునకు
ఎఱనొనర్చితొ నీ గుణమెఱుక వచ్చి
ముఖ్యులగు రాక్షసులు రాకపోరు యనియ ?

అందమైన స్త్రీని యడవులలో డ్రిప్పి
కన్నుగుట్టజేయు పన్నగడయ ?
పలల హోమలైన వడతిగస్పడ జిగు
రందు జిక్కుపులుగుమంద మతులె !

కొండమల్లెల వాన గురియులోయల్లో
నిండు గోదావరి నిశితచూపుల్లో
పండువెన్నెల జాలువారు మైకంలో
ఉండబట్టిన నీదుగుండె దిటవుల్లో

తానమాడిన సీత తాదాత్మ్యమెంచి
మౌనరాగ సరాగ మతిని నిద్దలచి
ఆన యిద్దరినను మధ్యాన మని పొంచి
ఏనమ్ము జోడు షోయెను డాలువంచి

మనసిజునకున్నవే సుమమార్గణములు
దంపతుల మిమ్ము కలుపు సాధనములేక
ఓటమిని యొప్పుకోలేక చాటుదారి
శూర్పణఖ గుండెలను పొగచూరజేసె

ఐతే కానీ రామా
నాతికి నక్తంచరైన నరులనెగానీ
చేతోద్భవు చేష్టల కా
మింతురు యీ న్యాయసూత్రమే
తెలియనిదా ? !

వలపు మాటలు శ్రుతి పేయములుగ, ఆల
కించి, తమ్ముని నవ్వాలకించి, చూపి
అతని, పత్నినుదూరు బాధ్యతల జూచు
వాడునా, గిలిగింత రవ్వంత పెడితో ! ?

ఎందుకై యింతదీక్ష బోధించినావో
నీదు నడవడిచే సతీ, సోదరులకు
నిన్నె నమ్మినవారొట నీడలాగె
ఆచరించిన యశము నీ వాచకమ్ము

రెండు వాయించి పంపించకండకావ
రమ్ము తగ్గదే ? కామరూపమ్ముతగ్గ
అవయవ వినాశమందు నా ఆననమ్ము
నందు చిహ్నముక్కుచెవులు నరకుశాస్తి

ఔనుకాదనబోదుగా జానకమ్మ
నీవు కనుగీటు లక్ష్మణు నీతి నడలు
నొచ్చి రక్కసి తనవారి తెచ్చులోన
చికిలిబట్టి శిలీముఖ సుకరుడైతె ?

పదులు వందలు వేలుగావచ్చి చచ్చి
నారు నీచేత రాక్షస వీరులంత
ఖరహరప్రియు హస్తలాఘవము గాంచి
సీత చెంగల్వకరములు చేర్చినిమిరె ....

రాక్షసులహద్దు దండ కారణ్య యిక్క-
మిగులలేదొక్క-డునుగూడ; పగలుబలము
లేనివారలు, నిన్నోంటిగానెపెర్చి;
నిర్భయానంద పుడమిజనిశ్చలాత్మ

ఖణఖణ వెల్గెమునుల యాగముల యగ్ని
అగ్గిరాజదు రాక్షస యతివ లిండ్ల
సీతసతియోట యాచుప్పనాతి వలపు
రావణుని లౌల్యమున కెసరాయె ఉడికి

జనపథమ్మునగల రాక్షసాళిజంపి
వారినాయకుడెవరో రావలయునింక
లక్ష్మణా! జాగ్రత యుభయులము కంటు
వత్తిడుకొని మీ వదినెకాపాడ నంటె

పంచశరు విరోధి భక్తు డయ్యెనులంక
నేలురావణునికి చాలు చంచ
రీక దుష్కృష్ణఘాతుడై కృపణుడగుట
కెల్లలోకములజయించు టిడియ

చెప్పనలవికాని శృంగార వతిమాన
వాంగనోర్తు దండకాటవంద
కలదుయన్న తృప్తిగావినె సోదరీ
భంగపాటులో సువార్త యేమొ?!

సీత మనసుబొమ్మ శ్రీరాముడే; రాము
తనువు మనము ధనము ధరణి జాత;
సాధురక్షణమునకు సంసార విచ్ఛిత్తి
కోరుకొన్న ధర్మవీర యుగళి

సీదు:భూకుటి ముడివడు నేనిజగము
లల్లలాడుట గనె తేటతెల్లముగను
భార్యనీవెటులుపయోగపర్చుకొన్న
యశము తనపేర రామసహాయపడుట

అనుకొనను వ్రాస్తున్నా
నని శ్రీరామచంద్రుపేరు నా చెవిపడ ఝ
ల్లను యొడలూ హృదయము నా
మనసెటకోవోవు రఘురామా కవినేనా ?

ఆడయేనుగ మాటున కావలుంచి
గోతమదకరీంద్రిమ్ముని కూలజేయు
రీతికనిపెట్టినావు; మాయాతిమిరము
కన్నుగప్పుట కాలము కలసిరాక

పక్షిపడకుండుపెట్లు నీ పన్నుగడకు
వలను పఱచితి వికవాీలవలయు దొరకు
సూటి పనులెగానీ రాక్షసుల విధాన
మాయలెఱుగవు యనుభవమాత్రిశీలి !

ముదితలడుగుట పురుషులా ముద్దుతీర్చు
టయును కలదైన రత్నమయయుకనకవి
కాసమగు లేడిబట్టు జగత్తు నవ్వ
బుద్ధి పెడదారిబట్టెనా పోయిజంప

మాయలేడి రూప మారీచుడనుకరిం
చాడు నీదు గొంతు చక్కగాను
హాడలె సీత ఆడదగుట యన్నదెయను
విడచి లక్షణుండు వెళ్లతగవె ?!

అడవి యొంటరిగానున్న యతివ రాక్ష
సేశ్వరుడు బట్టి మిన్నున కెగసిపోయె
కంటబడతఱుముటకు కాకాసరుండె!
నీదు కథలన్ని వినక రాలేదు వాడు

వరములిచ్చి తీర్చవలసినప్పుడు బాధ
పడిన తండ్రి మడిసె పడతి కతన
తరుణి కోర్కెతీర్చుతానని వెళ్లావు
గట్టిచిక్కు నామె పెట్టినావు

పక్షిలేనిగూడు పర్ణశాలను నవ
పత్ర సుమములెల్ల వాడిపోయె
'అతనికంటె ఘనుడు ఆచంట మల్లన్న'
అన్నదారి తమ్ముడెన్నుకొన్న

మగని వెదుక బంపె మఱదిని దూఱి ప్రి
తీక్షలేకయున్నదే మృగాక్షి
పర్ణశాల చుట్టుపక్కల వెదకేవు
చాటుమాటు ఆటసమయ మటవె?

ఇంక చూసుకో నీవెవో సంకటమున
బడితివని తమ్ముడోదార్చు భాగధేయు
డింట విడచిన యిల్లాలి నోంటిపాటు
కంటతడిమంజులార్తి శృంగారి గనడె ? !

చెవులప్పగించె నీ సీతాభివర్ణనము
లేళ్లగమి, సింగముట్లే నిలచిపోయింది
బటిమీది పాముపైవ్రాలి గరుడుడు విడచె
ఋషివాటికల గాలిరోజుతూ పొగిలె
జలకాంతలెల్ల వెచ్చగ నూర్చెడస్ని
విలవిలామోదె తలవిచిముబోసిన చెట్లు
పుట్టలూ గుట్టలూ నిట్టనిబువ్వున వగచె
ఔక్కలాడక పక్షి బిక్కమొగమేసింది....

నీ ప్రణయబాధ సీతా పతివ్రతకన్న
తమ్ముడొక్కడె బహుధాపంచు కొనెవిని
భార్యావియోగ తాపము సమంబిర్వురకు
కానైతె నీకు సంగ్రామ పర్వము రామ !

వనమధ్య రణచిహ్నాలు కను
గొనిచూచిని పొల్లాడుతూ కొనయూపిరితో
జనకజ వృత్తాంతము చె
ప్పిన జటాయువు పక్షి బంధు ప్రీతినిమిరితో

జటాయువునకగ్ని సంస్కారమిచ్చి
దశరథుని తలచి యాతని ఋణము తీర్చి
భూపుత్రి నెత్తుకొనిపోయె లంకేశుడను
పలుకె చాలును సీత బ్రతికెయున్నది యను
మానమేటికి కనపడిన మార్గమునుబనడుగ
సౌమిత్రి చెప్పినా చాలదో భ్రమలుడుగ
వెదకు యారాటమో విధిచెప్పుమో తెలియ
శరభంగ సుతీక్ష్ణులాసక్తి నిన్గని పొలియ
వ్యథనీదు యాకలేమైనా పండ్లిచ్చి
కనుమూసె శబరి నీ కథకు విలువిచ్చి
తాదాత్మ్యమొంద సందర్శన మిపెయ !!

అడవులన్నీ తిరుగాడు నట్టివిధము
గడ్డమూ, మీసలూ యెదుగకయ చూచు
వారి సమ్మోహనాకార పరతమించ
దశరథాత్మజుడను మాయ తవిలియుంట

పంచవటి లోపుగా ఋషి వర్యులందు
ఏ నలుగురైదుగురో తమజ్ఞానకలన
నిర్గుణంబైనతత్త్వమే నీవు రూప
మునకు వచ్చినావన నవ్వకొనవె రామ!

ఆరణ్యకములు నీ యర్ధాంగి పై నీకు
ప్రేమకలాప గీతా మనోహర ఋకులు
సీతా వియోగ గాసిని నవ కావ్య స్వర
ప్లావితమ్మయ్యె సామాన్య జీవిత కథలు
మెఱపుతో పరుగెత్తి మేఘాల కనువిప్పి
చెఱువుతో కొట్లాడి చీమతో మాట్లాడి
జూల కదల్చివిదల్చి బాలచంద్రుని దల్చి
పూలమొక్కలనలిపి పొదలచీకటి మలపి
గజసింహముల రాచి గమన మధ్యముతెంచి

నీ సీత గొంతు రానేరాక నీ లోన
నెమలి కంఠ కరాల నీడ నిల్చితేకాన
రావణుని వెదుకగా రాదొ ఏమిటికని
సావధానప్పు రిస్పష్టగా సీధ్వని

నేలమీద జంపనేఅక గోతిలో
నెట్టి పొర్లిణపూడ్చి పెట్టినావె
ప్రతిఫలము విరాధపండితుడనిరిగా
రామబాణములకు రాణమెఅసె

బాహువులు తెగి యక్షుడై పల్కెఋష్య
మూకమునసున్న సుగ్రీవు సఖ్య మొందు
మనె కబంధుడు; కారణమ్మడుగ చెప్ప
జాల దేవరహస్య విశ్వాస మనడె!

ఈ శరీర బంధములూడ్చి ఇలవి దేహ
మగ్ని తప్తమ్మవగ నిజమర్మమెల్ల
జ్ఞప్తిగొని శాపమోచను తృప్తిపర్చ
చెప్పదగినంత చెప్పె సశేషమింక........

వాలి తనతమ్ము నాలి చేబట్టినాడు
అతిబలాఢ్యుడు వాని భయమ్ముచేత
నున్న సుగ్రీవుడా నీవు యనుచున్నమిన్న
ఎచట నున్నదో వెదకః నీ కెట్లుతోచె.

స్వాయముగా వాలి యున్న రావణుకు హతలు
నరుల వానరులను వాడు సరకుగొనడు
అనిమిషారి మానివిరోధి యా పులస్త్య
పౌత్రు మానవోత్తముడా నీ వంతుజంప

వాలి తోకతో గట్టి రావణుని దెచ్చి
కాళ్లపై నీకుపడవేయగలడు; కాని
వైరి నీచేత చావగా వలయునంతె
సాటిదుఃఖితుమైత్రి ప్రశస్త తమము

దనుజపతిపేరు విన్నచో కనులుమూయు
లేరు దివిజులు మునులు పోలేరు వనుల
చేయరానిది తప్పు నీ చేడె నపహ
రించుటిక రావణుడు నిదురించపోగల

కామినీ కళ్ల వెల్గులో కాళ్లు తేలి
షోవు లంకాధిపతి సీత బోలు నాతి
నెఱుగక యడియాసపడి మున్నిటిదాటి
వచ్చు పతియన్న నమ్మనివాడు, చెడడె....

స్నేహశీలి సౌహార్ద్ర ప్రవాహరాగ
కోకిలధ్వని చిఱుగంతు నోకెశ్రుతికి
ననలు దొడగి పూచినవి చెట్లనుపమాన
మందమలయానిల సుగంధ పొందు విందు

కాదగిన దేమియును కాకపోదు; దాని
కనుగుణమ్ముగవ్యక్తి సంఘటన నడచు
సౌకుమార్య సుశీల పరిశాంత ధైర్య
చిత్త! రామ నీ మది నిండు క్రొత్తదనము

వానచలవైపు యందునా వనట గుందు
వానివైపునమ్రొగ్గె నీ మానసమ్ము
కాంతకాంతమౌ మానసగ్లానియుడుప
గాలి పిల్లడు సుముఖిరాగలడురామ!

లేడి వంచించె నీ వొక లేడి కనుల
దాని రక్షించలేక గ్రంథమ్ము పెంచి
నావు!! కాకాసురుడు భూమి జావిరోధి
కళ్లబడ నీ ప్రసాదమ్ము కన్నులొట్ట

కాకి గావున నీ బాణ పోకడల తె
మల్చుకోలేక చిక్కె; యా మాయలేడి
వెంటపడుగెత్తినావు నీవే, దశాస్యు
కులము వారలతో జంపకొరితిదందు

పంపా తీరము
చంపక సారము
సొంపగు సూత్రము
ఇంపగు చిత్రము
కమలా కరమధు
కర బాసల పృధు
దర్యాప్తుల సుధ
ధర్మాత్ముల కథ

కోరినట్టి వరమె
తారసిల్లై శరీర
మిదియ కాదటన్న
మేలుకాదు;

ఉన్నదానివల్ల
యుపకారమొందేటి
తెల్వి లేకయున్న
తేటికుట్టు.

అప్రతిమాన కోదండ ప్రకాండా
ఆర్ష విజ్ఞాన సౌందర్యాతిశయసుభాండా

అభం శుభం
ఇహం పరం
నిరంతరం
మమాంతరం

రసప్లుత రసాలోక రసాధిష్ఠరామా !
రసప్రద నీరసచ్యుత నిరాశక్తకామా!

మాట తీయని వాడా !
మనసు మెత్తని వాడా!
మరులు కొల్పే వాడా !
మనిసి కందని వాడా !
నేను నీ వాడా !
నీవు నాకగు వాడా !

శ్రీ మద్వేదాంత విద్యా ప్రవీణా! సుప్రకాశా!
సుజన రంజనవికాశా! ప్రమోదాంతరంగా!
విలాస ప్రసంగా! సత్యాగ్రహా!
సత్యస్వరూపా! స్తుత్యకథాకలాపా!
అహంకారశూన్యా! భక్తాభిమానా!

శ్రీ మన్మహా దివ్య సౌందర్య గాత్రా
సౌష్టవానంత మాధుర్య కంఠా!
శరణాగత పాపహరణా!
వశ్యవాక్యా! నరో
త్తమా! రామా!
శ్రీ సూర్యకుల
విభూషణా
నమస్తే
నమః

కారణజన్మా! కౌసల్యారామా!
వీరమూర్ధన్యా! విశ్వంభరణా!
పరమాత్మా! ప్రాణసఖా!
విరచించెదు నీదుచెల్వు
మురిపించెదు నీదుకొల్వు
సరసా! సాహిత్యప్రియా!
శుభం.

కవిత కానిదేమికలదు వాక్కున్నంత
వరకు దాని పటిమబట్టి తార
తమ్య ముండునంతె! ధన్య
తములు రచనా విశిష్ఠ
లగుట జేవయబ్బె ........

కవితకు
వలసినదల్లా
సువిమర్శన
వ్యాఖ్యా సిరసులగు
మందలు పొడవుటకె
తోడ్పడు పలువురు
కవిగాని ప్రశంస చేయగా
నిలువదులే

# శ్రీ రా మ చ రి త ము



## మ ధు వ న ము



పా ఠ కు డు

అత్తిలి సూర్యనారాయణమూర్తి



# ఆ శీ ర్వా ద ము

సాకులేని స్నేహ సంబంధి వైతివి
పొ్రకులాటలేని పరమ మైతి్రి వెల్గు
చెరుకువాడ వెంకటసుబ్బారావూ!
మధువ్రితాళి పూలడోల!



# మ ధు వ న ము

నీకు సఖ్యమ్ము కావలె నేర్పుమీర
పలికి సుగ్రీవువైపు త్రిప్పవలె మిమ్ము
స్వారనియుక్తుడు నీతివిశారదుండు
మీకభిముఖుడై వచ్చె సమీరసుతుడు

సఖ్యమునకు గా నీవు చేజాచకుండ
అమిత శరచాపధరుల మీ యన్నదమ్ము
లకని భయపడి పోవు వాలతమునుగని
ఇంగితజ్ఞుడవై రామ పొంగి పోతి

రాజనీతివిశదు యంజనీ సుతుడు సు
గ్రీవుకేలు నీదుకేల నునిచె
అగ్నిసాక్షిమీకు యగ్నిసాక్షిగ చేసు
కొన్న సతులతెచ్చుకొను వరితమ్ము

అన్నా దమ్ముల తగవుల నీ
కన్న కలుగజేసుకొన్న కాకుత్సపు రా
జున్నాడే రామా! యా
పన్నుల భుజమేయు ఫక్కి పట్టెను నీకే!

వాలిని జంపే వాడవా కావో
తేలిపోవునని తాళ్లను కొడితివా
పోలిక తెలియగకపోతే కూల్చగ
జాలవనుట నిశ్చయము, దాల్చగా
పూలహార మిడి పోరించిన పం
థా తెలియగక తారాపతి పడిసెను

కోృతి పోరులోగొన్న విజయమ్మిది
సీత చెఱను విడిపించే సూత్రమ్మిది
అన్న రాజ్యమూ అనుజునికిచ్చే
ఆచారము నీ కలవడె రామా!

వాలి బంధనాన్నగల రుమాసతీత్వ
మెట్టిదో పరీక్ష చేయకే కట్టబెట్టి
మఱపుగొనె కోృతిరాజు నీమాట; వాలి
గుచ్చు శరమును జపి్తకితెచ్చువరకు

వాలిజంపెద ఏలించెద కి
ష్కింధ నిన్నని చేసి ప్రతిజ్ఞ వి
శ్వాస హీనుడని సర సరా లక్ష్మణు
కోటముందు నిలుప వాటమగునె?

బలి ముఖులు నేల యీనిన పగిది వచ్చి
విడియ నలుమూలలకు సీతాన్వేషణముకు
బంపు పథకమ్ము చతుర దిగ్బంధనమ్ము
రావణుని రాజధాని పేరైన వినరో ?

అంగదుడు జాంబవంతుడు ఆంజనేయు
డాదిముఖ్యులనే దక్షిణావి వెదుక
బంపుతూ రామముద్రిక పావనికిడు
భావమేమని తలపోయవలెను మేము

ఒక్క నెలలోపలే సీత యున్నచోటు
తెలసి రమ్మను యాజ్ఞ సాధించితీరు !
భరతుపదునాలుగేండ్ల తర్వాత నొక్క
దినము మీరక చూచెదననుటకాద ?

అంతరిక్షాణపోవుచు ఆర్తయిచట
నగల మూటను విడిచె నన్నారు కపులు
మీ వదినె వేమొ చూడు మన్నావు; లక్ష్మ
ణునికిది పరీక్ష సీతమ్మ యనిన పిదప

ఎగురజిమ్మితి దుంధుభి ఎముకగూడు
కాలిగోట; సుగ్రీవు తెంకగ నొనర్ప
నీ ప్రదర్శన, తారకన్నీరు తుడువ
వాలి కొడుకుకు యువరాజ పదవినిస్తి

మాటకారి తనము సుధర్మజ్ఞతయు వె
లార్చి వాలినోటికి నీ తాళమ్ము వేస్తి
వట్టి విశ్వాసమే గామ వానరులకు
రాజు సుగ్రీవుడా? కాదు, రామ నీవె

అపహరింపంగ బడినట్టి యాలిగూర్చి
హితుని కోటలో బంధించ, సతినిగూర్చి
చింతచెక్కిళ్ల ధారలో సిగ్గుచెంద
తారమంతాంగమున వాలి తమ్ముడొప్పె ....

సీత జాడలు తెలియగా జెప్పగల్గు
వాడు రాలేదు; రాలేదు పవనసుతుడు
వాలి జట్టును; వ్యవధి యానంత లేదు
రామ నీ ముద్రికా ప్రభావమ్మె రక్ష.

దధిముఖుడు చెప్పగా విని
మధువనమున తేనె గ్రోలి మైమరచున్నా
రు ధిక్కారణులనగా యి
వ్విధి మారుతీ విజయము సూవేయనలేదా ;

హనుమంతుడిచ్చె చూడా
మణి నీ పాదముల కెఱగి మైపులకల నా
తని కౌగలించి దశముఖ
తన మూడ్చివచ్చెనని యాతని కథవింటే....

ఎటుపోవ వీలులేకను
అటమట స్వయంప్రభాగుహాంతర్గతులౌ
విటపీచరులకు నీ పే
రట బ్రతికి బయటపడగసరా యిది నిజమా ?

అడవులలో లాంగూలులు
పడిన బాధలుడుగగా సంపాతి నుడువులదా
కడలి దాటుట లంకాపురో
కడకు దెచ్చుటనగ దూత కార్యములంటే!

అశోక వనముకదా యందుసీత
నునిచి రావణుడెవ నూల్కొను కోత
రేయింబవలు యన్నారీరత్నమునె ధ్యా
నించి మతిసెడె యతని నిరుపమాన వనమ్ము
చెఱచి రక్కసులను చెండాడ తనవాలమ్ము
అంటించమను రావణాజ్ఞ సులభముగా
రాముకార్యము కొంత రాణించు విధిగా
కరువలి కొడుకును గాచె కృశానుండు
లంకాపురిని గాల్చెయేశంక లేకుండ
భళిభళియనగ సభాస్తారులంత
కళదీటువడె నీ ముఖాంబురుహము వింత ?

నీకు తగ్గవాడె నీదూత కూడాను
సురస లంఖిణులను దరువుబట్టె
చూచిరమ్మని చెప్పకాల్చి వచ్చినవాడు
భక్తులందు నీదు పాణసముడు

కావ్యమల్లి చెప్పెగాలికుమారుడు
కన్నదేమి కాదు విన్నదంతె
విషయమెల్ల శుభము విస్మయ సౌందర్య
మగుట దంపతులకు మంగళమ్ము

అగ్నిహోత్రార్చనములు వే
ధాధ్యయనము.... ....కల్గువారలైన రా
క్షసుల మధ్య
పానమూ స్త్రీవ్యసనమూవల్ల జంప
నర్హులన్నావు ప్రకృతీ మన్ననలు సున్న

నీదు నామజప వినిశ్చల చెఱగని
బొట్టు కట్టినట్టిబట్ట మాయ
దవనిజాతకనగ యనసూయ వర ప్ర
సాదమెంచి వంచలేదె తలను

రావణు విభవశీవి తిరస్కరించె
గడ్డిపఱకగా సీతాప్రఘాతికాదు
దితి, తనూభవలెల్ల బాధించ త్రిజట
కలగనెను రాము జయమన కలత విడెనే?

శోకతప్త రక్కసులమధ్య నశోక
వనికడానిలత బవలును రేలు
లెక్కపెట్టు మాసమొక్కటే గడువను
మాట. కాలమెట్లు దాటగలవు ?

అశోకవని విధ్వంసము
నిశాచరరాట్సుతుని వధ, నిల్చిన సైనం
దశాస్యుకొల్వున పావని
ప్రశాంతపుటంచనాలకు వైరినెఱుగుటకా!

సీత కన్నీటిధార ముంచెత్తె లంక
హనుమ యంటించి విడిచిపోయిన రఘూత్త
మా! ధనుర్బాణపాణివై మందుకనుల
ముదలకపిరాజు లంకేశు బ్రతుకె చెఱచు

నరవానర సంయోగం
కరమద్భుత చరితంబిది కపివాహనులై
దరిసిరి కడలీ తీరం
వెరపెరుగవుగా! వ్యూహ విధమెట్టిదియో! ?

అవనిజాతకెఱుకె ధవుని సామర్థ్యము
వనధిదాటి నరుడువచ్చునన్న
నమ్మలేదు రావణాసురు బుద్ధి మాం
ద్యమ్ము విజయమునకు దారి నీకు

విజయీభవ! దిగ్విజయీభవ!
రామ!
సుజనావనా శత్రుసంశోధనా!
సురవందితా! అసురమర్దితా!
సీతా!
కరస్పందితా! కౌసల్యానందితా!

సహచర సహజన్మ సమా
దరణా! కులదోషహీన కరుణా భరణా!
అహమికశూన్యా! సుహృద్భావా!
నిరవధికలోక సేవాధన్యా!

సుముఖా! భోగవిముఖా!
సుపంథా! విదళిత పరిపంథా!
అర్హజనామోదిత
హర్షహృద్వికాసోదిత
వాత్సరళా! నేత్రాంచల
వశ్యజీవ! శృతిమంగళ
కవిని నేను కార్ముక ప్రధానుడవీవు
జయమునీకు సుప్రసన్న విడుద

# శ్రీ రా మ చ రి త ము



## పు ష్ప క ము



క వి సా క్షి

అత్తిలి సూర్యనారాయణమూర్తి



# ప ట్టా భి షే క ము

అత్తిలి వెంకట సుబ్బారావుకు.

చి ర ం జీ వీ !

అన్నిటను తమ్ముడవు యిచ్చుటన్న ప్రీతి
పితృసముడని ననుగౌరవింతు వెపుడు
పలుకుబడి చేతివాసి నీ వైద్యఘనత
రాజమాన్య వెంకట సుబ్బారావు....
స్వస్తి . .



# పృ ష్ఠ క ము

ఉదధి సంకీర్తనల కపియూధ విడిదె
గాలి బావుటాలెత్తె సంగ్రామభేరి
వినియు హద్దుమీఱడు తన యునికి మనికి
తేటతెల్లమ రహదారి బాట సుఖవె ?

వానరసేనతో వనధిదాటాలి
కనలేదు వినలేదు కడలిగట్టుటలు
సేతుబంధనకార్య శేముషీగరిమ
పూన్కి సుగ్రీవాజ్ఞ పొంపిరివోవ
చెట్లురాళ్లూ వేసినవి మునిగిపోయె
దర్భశయనాన్న నీదగు శౌర్యపటిమ
కడగంటి కెంపుసొగరు నుడికించ
బాణాగ్నినెండింతు పాదోధినంచు
లక్ష్మణా నాదు విల్లందుకొనుమనగ
ఏమిధైర్యమురామ ఏమిధీమా నీది ? !

సాయిలా బాయిలా మనిషైన సర్దు
బాటుకావచ్చుగాని నీవంటిగుండె
లోతు ముంగిమూశానమ్మ ఎంతకైన
తగువశిష్ఠుడూ పల్కలేదాయె యెదురు

ఉడుత వారధికట్టెను
జడనిధి కరములనుమోడ్చి శరణాగతుడై
పడె నీపదముల రావణు
కడగొట్టు సోదరుడు రామకార్యమ్మిదియా ?

వనవాసమునకుగా వచ్చెడివేళ
వెనుదగిలె నీమాట వినలేదు మహిళ
మగరూపమునయున్న మగువవా యంది
అగచాట్లకింతగా హద్దలేమిటంది
జనక మహారాజు నిను శైలూషుడనుకుంటె
తనకూతునిచ్చునా ? యనయొప్పుకుంటె
కనుగప్పి రావణుడు కాజేసె నతివ
ఖాయమైతే జానకమ్మమాటే; హితవ ?

అడవులబడుట యానాడు దైవికమొ!
పడతిముగ్రిచ్చిలువానిబలిగొనుటపౌరుషమొ?
ధర్మగ్లానికి జంకు కర్మవీరుడవు
మర్మమింతకు నీదు మనసుకే సాక్షి!

ఎవ్వరూ యొప్పుకొనకున్ననేమి లంక
రాజ తమ్ము విభీషణు రాజుచేయ
ప్రతిన పల్కితివపుర నిందితుని గుట్టు
తెలియు నీ చతురోపాయ ధీరగుణము!

లంకేశు కొల్వులో ని
శ్శంకగ నెదురాడె విభీషణుడన్నకు రా
మాంకితుడనె హనుమంతుడు
లెంకగచేగొనుటలో, భలేయుదారుడవే!

కొంపలంటించి పోయెగా క్రోతియొకడు
వానరులతోడ లంకగవనుల ముట్ట
డించినా లెక్కగొనడు కామించువాడు
కన్నుతెఱచులోననె నీ శంఖారవమ్ము

చావుదప్పె గూఢచారులు శుకచార
ణులకు కపులవల్ల దెలిసి పొందు
యనుచు విడిచిపుచ్చ యరిభీకరుడవని
రామ ! చెప్పినారు రావణునకు....

లంక చుట్టునూ జలధి యేలాగ, నరుడు
వచ్చుననుకొన్న రాక్షసేశ్వరుని కడకు
బంపి యంగదు సీత నిప్పటికినైన
వదలుమను సూటిప్రశ్న ?! రావణువదలుదె ?

దశముఖు కిరీటమును కాలదన్ని పట్టు
వడకవచ్చినా రాజైనవాడు చేయ
రానిపనియని సుగ్రీవు మేనునిమురు
శెల్ల మున్ముందు యుద్ధపటిష్ఠతలకె

ఖండనము సాగుచుంట నీ భార్యకింత
కబురుసేయవు రాక్షసాంగనల రోద
నమె యశోకిగాజాలు జానకికి వార్త
ఎఱుగుదవనిజ బ్రితుకు లంకేశు హృదిని

కుంభకర్ణుడాది జంభారి యరివీర
వర్గమెల్ల చచ్చిపడిన కచ్చె
మాన్పబోడు యిది యమానుషమనియెంచ
లేదు రావణుండు; దాశిబలి యు ....

నాగుబాముల బంధించినాడు యిందర్జి
జిత్తు మాయా శరమ్ముల. స్వేచ్ఛనిచ్చె
అతని దర్శనమాత్ర మీ వెత దొలంగె
వైనతేయునె పోల్చ లేవైతి నడుడ !
మానవ దేహమ్ము మణిపుతో కూడినది
జానకిని మీముందు జంప మూర్ఛిలితి
మేఘనాధుని చిత్రిమిది సీత దేహం
రాఘవా! లేదు రణరంగాన యనుచు
శంబరే విద్యాదోషమ్మని విభీషణుడు
శాయశక్తుల తీర్చ మాయవిడె నొక్కొ
వైదేహి సిగపూవు వాడదని తెలిసి
ఎందుకో యీ శోకమీవనుభవింప ?
మైథిలికి నీ ప్రేమ విదితమవ్వాలా ?
పథకమా రావణుని పడగొట్టు రామా ?!

చచ్చెననుకొనె యింద్రజిత్శక్తిసాయ
కమున సౌమిత్రి; సంజీవకరణి దెచ్చి
హనుమబ్రదికించె పొలికలనందు పడిన
వారి : రక్కసదేహమెవ్వరిది లేదు ! !

రావణుని పెద్దకొడుకు పరాక్రమమున
ఈల్లకునికి సౌమిత్రి సంధించి విడిచె
సత్యసంధుడైతే రామచంద్రుడీ శ
రమ్ము పేల్చిన చచ్చె శ్రీరామ మహిమ !

స్వయముగా నీకు సాటి ప్రశస్త వైరి
వచ్చె; రావణువ్యక్తిత్వ వైభవమ్ము
గాంచి 'దుశ్చేష్టలుడుగ లోకాలనేల
తగు' ననుటవాని కాళ్లబంధాలువేత

అంపపొది శూన్యమగుట లంకాధినాథు
మగిడి సన్నద్ధుడవుగ రమ్మనుట వైరి
హీనగతి కాదనుట యహీన శౌర్య
శాలివని బుజువు శత్రువిషాదగీతి

రథికు రావణుతో పోరాట మాయె
విధురపాణి స్యందనము పంపించెగాని
కొలదికిని మించుతూణీర కోటిగల్గి
నంతమాత్రాన్న దశకంఠుడంత మగునె ?

దివిజవైరి మునుతెలియని విధాన
కళలు దప్పఁసూచనలు మాతలి గ్రహించి
ఇపుడ బ్రహ్మాస్త్రము నభిమంత్రించి విడువు
మనుట విజయుడవైతిరామా ! ప్రతాపా !

లక్షలాదిగచచ్చినా లంక ప్రజల
చీమకుట్టదేమో ! నిత్యజీవనమ్ము
సమయగతి సాగుచుంట దశాస్యపాల
నా విధాన విశిష్టతన్నావు భళిర !

స్త్రీకొరకు రావణుండింత చెడెనటంచు
స్త్రీకొఱకె లంక మగపుర్వులేక జేస్తి
రాజుగా రావణుడు పొగరాజచేయ
రాజుగా మంటలూదు ప్రభంజనుడవు

ఏ విరోధుడనువాడన్నిటను మనకు
వెఱపులేనిది వానినే మఱముగనుక
కూడ కూడా తిరుగుసంగడీడు కొండె
గాడవుట దురదృష్ట పోగాలతనము

కొనయూపిరిని నేలకూలియుండినను
ఘోరాజికాలాన్న కూడ చెదరని పరిభుత
లంకేశు రాజ్యాంగ లక్షణాలేవో
లక్ష్మణా ! యతనివల్లనె వినిరమ్మంటి
రాజ్యపాలన భవ్యరీతులు
రావణునికడ తెలిసిరమ్మని
లక్ష్మణుని పుత్తెంచగా యీ
సూక్ష్మరీతులు వలయువారినె
పంపుమనె రావణుడు యంత ని
లింపులాశ్చర్యమ్ము బొందగ
వైరికిని తలవైపు నిలిచితి
పొడిగాదిది సంప్రదాయము
కాళ్లదరి నిలవాలియనె ర
క్కసుడు నీవాకార్యసిద్ధికి
నమ్రుడవుగానాయఘణతులు
నమస్కారుడవౌతు విన్నావా ?
సీతపాట్లకు ఫలము కన్నావా ?
శ్రీరామచంద్రా!
యాతావతా మర్యాదగొన్నావా ?

సీతావియోగ మిక సహించేది లేదు
నీ తలంపున కామె నచ్చేది లేదు
కఱవుకళ్లతో చూచు కళ్యాణి చూచి
పరువుకోసము లోని భావమ్ము దాచి
శుచిఘడకయున్నచో చూడనే నొల్ల
సూర్యాన్వయమ్ములో నొచ్చు లేకల్ల
యనుతెల్ల నీహృదియను తాపమెల్ల
మనసిచ్చి విఱిచేసి మనుమనుటవల్ల
ప్రజలముందర సీత పరమనిర్దుష్ట
నిజముగా నీసతి నీకిచ్చు ప్రతిష్ఠ
వీతిహోత్రుని చేతివెలుగు నీతట్టు
సీతమ్మ కళ్యాణి చేర్చుకొబొట్టు

తనకపకారుల రాక్షస
వనితలతో చల్లనైన వాక్యములను సీ
తను సితాబ్జ శుభ లో
చనములగను శ్రీవిభీషణుమార్దవమే !

అన్నదాన్ని తెచ్చుకొన్న వానితమ్ము
డన్నమాట వినక నిన్నుచేరె
అన్నమాటచెల్ల మన్ననపుష్పక
మిచ్చిపంపె చూడవచ్చు భరతు

పుష్పక విమానమున మీరుపోవుచుండి
ఇచట నిచ్చట నీకుగా యేము బాధ
పడితి మనిచూపినావట భార్యజీతి
ప్రణయసౌశీలవర్తితుడనుకొనగ వలెనొ ?!

కామరూపియయ్యు రామరూపంబెత్త
నేరడయ్యె రావణీయ మిదియ
మోహరూపివయ్యు మోహనాంగికిగాను
రణమొనర్చ చరిత రాముపేర.

ఇంగితజ్ఞు ఆంజనేయు
నేగి కైక కొడుకుతో
భంగపుచ్చడయ్య రామ
భద్రుడు కపిసేనతో
వచ్చుచున్నవాడు కుశల
వార్త బంపెననుటతో
భరతు ప్రేమ పల్కరించు
సరళిదెలియు దీనితో
నాంది రామరాజ్యసౌమ్య
విందు కౌగిలింతతో—

•

పూజ్యరాలు పుడమిపుత్రి సౌభాగ్యవ
తీలలామతోడి తెచ్చెదనుజ
వనచరాంగనలను పట్టపురాణిగా
సత్కరించ ...... రాము సమతదేవె!

ప్రజలు ప్రణమిల్లి నారింత
వరకు పాదు
కలకు ప్రజలకు వినతుడై
మెలగె భరతు
డిపుడు ప్రజరాజు రాజప్రజ
పని సరిస
మానప్రతిపత్తి దోష సమాన పరులై-

అప్రమత్తులై రామరాజ్యాంగ విధుల
జనులు నెరవేర్చవృత్తి రక్షణయు సాధు
శీలబుద్ధిమతీంద్ర సంసేవనలును
నిర్వహించుట ప్రభుత మన్నించుపథము

అభిరుచులెఱింగియందరి
కన్ని వంటకములు
భూరి పసవన సగౌరవాదరణ
సకలాపుసరవస్తు రమ్యవిడిదె
స్థలులు కూర్చుట నీ వ్యవస్థకెశుభమ్ము.

పదునాలుగేండ్లు నీభార్యతో నిల్లు
వదలి యడవులబట్టి వచ్చినా నీవె
ప్రజల మంత్రుల ఋషుల బాధ్యతవహించ
నిజసత్వ సాత్త్వికమనీష కలదంచు
సీతాయణమె జేజేలు పట్టించె
నీ తరమ నా తరమ నిర్వహించుటకు
అమ్మకడుపుచల్లగా అత్తకడుపుచల్లగా
నమ్మకొన్నందు కెన్నాళ్లకైనా జయమె

సీతమ్మతల్లి నీ చేతిలో పావు
పోతరులగు దానవులకు కన్నెఱ్ఱి
ముందు నామెనునెట్టి సందుచూసుకొని
ఎందుకో తెలియని ఎత్తుపైయెత్తు
చదరంగమాడి పసందుగా పేరు
కదనకుతూహలా ! కాజేసినావే?
సీతాయణమ్ము నిజేచ్ఛ మార్చుకొన
మాతల్లిపేర రామాయణమ్మాయె

ధరణీ జాతామనో
ధర్మప్రకాశా!
తరణి కులదీప్త సౌం
దర్య ముఖాంభోజా!
ముక్తసరి వాక్య స
మున్నతా కారా!
పరహిత పరమాప్త
ప్రవిమ లాంతర్యా

సుపర్వభాసుర ప్రమోద సుందరా వసుంధరా
విపద్విపా సపీతరాగవిబుధ వంద్య మిత్రవంశ
పయోనిధీ శశాంక ధైర్యసాగరా। సమస్త జీ
వ పరార్థ భావసేవ్యనామకృపాకరా ప్రభాకరా



రామచరితమ్ము రత్న నీరాజనమ్ము
అతిఛలోక్తిగ బల్కినా కానతిచ్చి
పుష్టిచేకూర్చుకొని సంపూర్తి చేసు
కొంటివిక కవికేది వాకొనగలేదు

పారితోషి కాలంకార ప్రాభవమునకు
ప్రాకులాడు కవీంద్ర సంబంధమెడపి
నర్మ సఖుడనై రామునన్నాను, జాన
కీ మనోహరు చిఱునవ్వు కీలకమ్ము

అకలంక అసమాన
అవనిజా భరణా!
సుకవి నిశ్చయసూక్తి
ప్రకటితావరణా!
విగతదోష విమోహా
జగతి మందారా!
నిగమప్రస్తారవి
హంగమార్గ సంచారా!

ఇయ్యది శ్రీనిఃశ్రేయసానందావబోధధర్మ
సూక్ష్మాద్వైత విభాషి ఆత్రేయస
గోత్రి సీతా కళత్రుండగు
సూర్యనారాయణాహ్వాయ
కవిప్రణీతం
సీతాయణం
సర్వం
ఓం
తత్సత్
లోకాః సమస్తా స్సుఖినోభవన్తు.

పండితుల కోసమై యిది
వ్రాయలేదు
కవుల భావనా చిత్రి వికాసకరిమ
సహృదయ సంస్కారులను రస
స్ఫూర్తి కదిపి
రాముడే నవ్వుకొన నాదురచనః
సెలవు

